పోత్రరాజు జానకి రామ దీక్షితుల
వారి కృతులు — సంకీర్తనలు
(బ్రహ్మశ్రీ పోత్రరాజు జానకి రామ
దీక్షితులు

Sl. no. 52

శ్రీరస్తు.



శ్రీరామచంద్రవర బ్రహ్మణేనమః



శ్రీమత్సకలసకలకలాపకామితముక్తికాంతావశీకరణదూతీమతి
బహుమన్యమానసంగీతసాహితీకవితానర్తకీనర్తనరంగద్రం
గస్థలాయమానరసనాసంభూతసంపూతవాగ్ఝరీ
వశీకృత సంపద్విలసితులు

బ్రహ్మశ్రీ పోతరాజు జానకిరామదీక్షితులు
వారిచేరచియింపంబడిన

——:00:——

# కృతులు

తత్పుత్రుండగు పురుషోత్తమునిచే
కేశవరాజు సమూహివారి స్వధర్మప్రకాశినీ ముద్రాక్షర
శాలయందుముద్రింపించిప్రకటింపంబడియె



౧౮౭౮ సం॥ ది ౩౦ యేప్రియలు
మఛిలీబందరు
టపాకూలిగాకదీనిక్రయము ౬ అణాలు



శ్రీరస్తు.

శ్రీరామచంద్రగురుపరబ్రహ్మణేనమః.

—:0:—

శ్రీరామాయనమోనమః.



శ్రీమద్వేంకటనాథమాదిపురుషం పూర్ణంపరం శాశ్వతం । శ్రీనాథంశరణాగతార్తిహరణం నారాయణం శార్ఙ్గిణం । కృష్ణంవిష్ణుమనంత మచ్యుతమజం గోవిందమిందీవర । శ్యామంనందకశంఖచక్రభరణం ధ్యాయేభజేకీర్తయే ॥ ౧ ॥ శ్రీదేవీహృదయారవిందమిహిరం లావణ్యరత్నాకరం । లీలామానుషవిగ్రహం సురనుతం రాధామనోనాయకం । రాకాచంద్రసమానదివ్యవదనం రాజీవపత్రేక్షణం । సత్రాజిత్తనయాముఖాబ్జమధుపం గోపాలకృష్ణంభజే ॥ ౨ ॥ నమశ్శారదాయై వచస్సారదాయై । నమశ్చందిరాయై జగన్మందిరాయై । నమస్తాచ్ఛివాయై నిరస్తాశివాయై నమస్తత్పతిభ్యస్త్రిలోకీ (పతిభ్యః ॥౩॥

విఘ్నేశస్తవము - నాటరాగము । ఆదితాళము॥

జయజయగణనాథ * దయాసనాథ । జయజయగణనాథ ॥అ॥ జయహృతసురబాధా * జయనిత్యప్రబోధ ॥జ॥ జయకుంజరవదన । గుణసదన । జయసదేకరదన । జయవిఘ్నసూదన । జయమోదకాదన । జయవీతవేదన । జయసుప్రసాదన ॥జ ॥౧॥ జయకపర్దిపుత్ర । చామీకరగాత్ర । జయదాసనుతిపాత్ర । జయమూషకపత్ర । జయపుణ్యచారిత్ర ॥ జయసురరిపుజైత్ర । జయవిశాలనేత్ర ॥జ॥ ౨ ॥జయరక్షితభువన । సముద్భావన । జయనతజనజీవన । జయపరమపావన । జయమునిసేవన । జయపోతరాడ్వంశ । జానకీరామావన ॥ జ॥

నాట - ఆది॥

ఉమాకుమార * న్నమామ్యహంశ్రీమ॥దుమాకు॥అ॥ శమాదిసద్గుణ * సమాజనిలయం ॥ఉమా॥ గజాస్యమాశ్రిత * రుజాపహారమం । బుజాసనాదిది * విజార్చితంశ్రీమ॥ దుమాకు॥౧॥ పినాకితనయం * వినాయకంవిఘ్న । వినాశకంకాం * చనాభదేహ ॥ ముమా ॥ ౨ ॥ నికామమోదక * నికాయఖాదిన । మకాతరంజా * నకీరామనుత॥ ముమాకుమా ॥

ఆంజనేయస్తవము - సౌరాష్ట్రి - అట.

భావించెదమది * పవనతనూజుని * భానుసదృశతేజుని ॥ అ ॥ భావభవునిగన్న * ఫణిగిరీశునుతిఁ । గావింపసాహాయ్య * కరుఁడయ్యెందుటకు ॥భా॥ రామునికార్యని * ర్వాహామునకుమది * ప్రేమజెలంగఁగను । భీమసాగరముని * ర్భీతిగదాటియా । భూమిజఁగన్నమ * హామేరుధీరుని ॥ భా ॥ ౧ ॥ అక్షీణబలమున * నాలంకలోపల * నక్షసుతుఁడాదిగ । రాక్షసనివహాసం * శిక్షణమొనరించు । దాక్షిణ్యయుతుఁదురి * తక్షయకారు

సీ॥ భా॥౨॥ మౌనిగణప్రియు * మంగళకరుజన * మానితవరశీలుని । గానరసికకన్నకా
భశరీరుని । జానకీరామసం * స్తవనీయ్యచరితుని॥భా॥

శ్రీరాగము - ఆది॥

ఆంజనేయమనిశం। భజేహ * మఖిలవిబుధగేయం॥అ॥భంజితలంకా సౌధనికా
యం * భక్తస్తుతసద్గుణసముదాయ॥ మాంజ॥ రామపాదసరసిజమదభృంగం * రాక్షసకు
లసంతమసపతంగం। చామీకరకుధరప్రతిభాంగం * సమదనికుంభాంబుజమాతంగ॥మాం
జ॥౧॥అక్షనిశాటమహీధ్రశతారం * హరికరికరనిభహస్తాకారం। యక్షపిశాచమహీజకు
ఠారం * వక్షస్థలవిభ్రాజితహార ॥మాంజ॥౨ ॥వానరసైన్యావనచణశీలం * వైరివీరచయ
గర్వవిఫాలం। జ్ఞానానందసమంచితలీలం * జానకిరామదాసస్తుతిలోల॥ మాంజ॥౩॥

విష్ణుస్తవము. మధ్యమావతి - ఆది.

శ్రీనివాసవర్షాంబుదమును నే * సేవించెద నెపుడు॥అ॥దీనసస్యసంవృద్ధికి జీవన * దా
నము దయనిడి ఘనతఁగాంచునా॥ శ్రీ॥ పేరురమున విలసిల్లెడు శ్రీ * చారుతటిల్లతకై వడిఁ
జెలంగఁగ । హారమకుటరత్నాంచితదీప్తుల * పౌరందరకార్ముకమన వెలసెడి॥శ్రీ॥౧॥సంసత్పే
శలగభీరవాక్యచయ * మురుగర్జితములగతి రంజిల్లఁగ। కరుణారసయుతకటాక్షజాలము *
నిరతిశయాసారాయుతమైతగు॥ శ్రీ ॥౨॥పోతరాజు జానకిరామునిహృ * చ్చాతకమును సం
తుష్టిగఁజేయుచు। వాతాశనవరకుధరనిలయుఁడై * ఖ్యాతిగనాశ్రితకోటిబ్రోచునా॥శ్రీ॥౩॥

ఆనందభైరవి - ఆది.

శ్రీనివాసకల్పద్రుమమస్మ * న్మానసనందనవనిని లుచుక్॥ అ॥ దానసతతకీర్త్యుజ్జ్వల
మైచను * రాసనముఖగీర్వాణ సేవ్యమగు॥ శ్రీ॥ మానితమగు వేదాంతము పాదుగ * మ
హితమైన ప్రణవము పెనువేరుగ । సూనబాణశతకోటిసమాన * సుందరకాయము మొ
దలుగనొప్పెడి ॥ శ్రీ॥ ౧ ॥ కరచతుష్టయము శాఖాచయముగ * ఘనవనమాలిక పల్లవ
వల్లరిగ। వరకౌస్తుభరత్నము పుష్పంబుగ * సురనదిమకరందముగానలరెడు॥ శ్రీ ॥౨॥
సైవలముకొనుయల మేలులతికగా * భక్తరక్షణము ఫలసముదయముగ । గానరసికమౌ
నిజనప్రకరము * పూనిశుకపికచయముగ వెలసెడి ॥ శ్రీ॥ ౩ ॥ సుకరముగను నిజదాస
భృంగములు * సురుచిరదాస్యరసములను గ్రోలఁగ। సకలవిభవములఁ బవృద్ధము గుచును *
ప్రకటమహిమచే శోభిలుచుండెడి ॥శ్రీ॥ ౪ ॥ పోతరాజు జానకిరామదాసుని * ప్రీతిమీర
ఘనతాపములడఁచఁగ। నాతతమగుతననీడఁజెలంగఁగ * భూతలమున శేషాద్రినుదయ
[మగు॥ శ్రీ॥ ౫ ॥

శివస్తవము.

సీ॥ శ్రీభవానీలోల * శిక్షితాసురజాల * జ్వలనోజ్జ్వలత్ఫాల * చర్మచేల। కరుణామయా
పాంగ * కరధృతశసారంగ * భస్మీకృతానంగ * భవవిభంగ । విదళితాఖిలదోష * విబుధ
సంచయతోష * మండనీకృతశేష * మంజుభాష। శరదబ్జనిభగాత్ర * సంహారీకృతసత్ర *
సమరభివామిత్ర * చక్రిమిత్ర। దాసహృద్వాసత్వక్తిరో * ధానవాస। నతజనశ్రీదపౌర

దా నవవిభేద। రాజితాచలగేహగే రాజవాహ। రాజితదయాంతరంగశ్రీ రాజ [ఖంగ॥

వారోజు - ఆది.

సాంబశివుని పాదాంబురుహములు ముదంబున గొలచెదను। మదిలోన ముదంబున గొలచెదను॥ అ॥ అంబుజభవశక్రాదులు వేడగ। రంబు భరించి జగంబులు నేలిన॥ సాం॥ ధరణిరథంబుగను। చామీకర। గిరికార్ముకముగను। ఉరగేశుడు గుణము రు సారథి విధి। హరులు వేదములు శరధినిషంగము॥ ఖరకరసోములు గురురథాంగములు హరిసాయకముగ పురములు గెల్చిన॥ సాం॥౧॥ పురుహూతుడు మురళీ। వాగ్దేవత। కరము ప్పగ వీణ। పరమేష్ఠి యున స్వైరువుగ తాళము। శిరిగానము మురహరుడు మృదంగము॥ పరగసేయ నిర్జరముని నికరము లరుదుపడగ నాట్యము సల్పిన శ్రీ॥ సాం॥ ॥౨॥ చలముచేత దక్షుని। యాగముతోడ। సంహరమొనరించి। సలిలజోద్భవస్తవముల చెలంగిమ। రల దక్షుని వే బ్రతుకజేసి యల॥ వలిమలసుత దగ బరిణయమై శుభ మలర జానకిరామాఖ్యు బ్రోచు శ్రీ॥ సాం॥౩॥

శహన - ఆది.

సాంబం హృది సంస్మరామ్యహం॥ సాం॥ అ॥ శంబరారిరిపుమఘ శైలశంబం॥ సాం॥ ఫాలకీలితాక్షమాలి నీలకంఠం। కాలకాలమఖిలలోక పాలనోత్కంఠం॥ సాం॥ ౧॥ బాలచంద్రమౌళిమగ కేళిలోలం। వ్యాళరాజభూషమరిక రాళశూలం॥ సాం॥౨॥ జానకీరామదా సానుకూలం। దీనమానవార్తి హరమ నూనశీలం॥ సాం॥౩॥

లక్ష్మీస్తవము.—కం॥ వైకుంఠభవనమునని। త్యాకుంఠశ్రీ జెలంగ నభిమతలీలన్। బ్రాకటముగ విహరింతువు। లోకత్రయవినుతలోల లోచనలక్ష్మీ॥

ధన్యాసి - ఆది.

శ్రీమహాలక్ష్మీమహం హృది చింతయామి। సర్వదా। చింతయామి॥ అ॥ తామరసోదర భామినీం। మద। సామజపరివృఢ గామినీం॥ శ్రీ॥ శ్రితజనకామిత సిద్ధి దాయినీం। సతతపరమపద సౌధశాయినీం॥ శ్రీ॥ ౧॥ వాణీవీణా వాదనలోలాం। ప్రాణిలోకపరి పాలనశీలాం॥ శ్రీ॥౨॥ ధరణీవలయో దారసితంబాం। వరకచజిత బంభరనికురుంబాం॥ శ్రీ॥ ౩॥ పీనోరోజభ రానతగాత్రీం! జానకిరామదాసతతు [భవిధాత్రీం॥ శ్రీ॥౪॥

పార్వతీస్తవము-కాఫీ-ఆది.

భవానీమామవ తుత్రిభువన పావనీ॥ అ॥ నవనీపవనీ నివాసినీ సంస్తవనీయ్యాగు ణగణాతిశోభినీ॥ భ॥ తుహినాచలసంతోషకారిణీ। దోషాచరచయసంహారిణీ॥ భ॥౧॥ కలమానిజన మనోరంజనీ। వికటదురితసంతాపభంజనీ॥ భ॥ ౨॥ చరణాంబుజనత సుర నితంబినీ। వరచికురహసితకాదంబినీ॥ భ॥ ౩॥ జానకిరామవరప్రదాయినీ। శ్రీవ [గేంద్రాగ్రసంస్థాయినీ॥ భ॥౪॥

సరస్వతీస్తవము- కమాచి-ఆది.

నారసనాంచల రంగస్థలమున నటియింపుము వాణీ। శుకవాణీ॥ నా॥ అ॥

సారససంభవురాణీ | పృథు* సైకతాభసుశ్రోణీ | నీరదవేణీ * నిత్యకల్యాణీ॥నా॥ ఘనకరుణారసవేణీ|జం *భూజితమన్మథతూణీ|వినతగీర్వాణీ*పీనాపాణీ॥నా॥౧॥చకిత హరిణనేత్రీ|ఘన*సారసదృశగాత్రీ|సుకృతవిధాత్రీ*శుభసంధాత్రీ॥నా॥౨॥నారదము నిజననీ|శ్రితజా*నకీరామా భయదాయినీ|సూరిజనావనీ * సుగుణమణీఖనీ॥నా॥౩॥

పంచాయుధస్తవము - చక్రిస్తవము- నాట- అట.

అభయంమమదిశతు | శ్రీహరిచక్రి | మభయంమమదిశతు ॥ అ ॥ఋభునిచయాధిరా* డధిమతస్వారాజ్య| విభవాభిరతుణ*పిధినిర్వాహక॥మభ॥చటులతరజ్వల*జ్వాలాజాలాతి | జటిలారదళితో *ద్భటశర్వరీచర ॥ మభ॥౧ ॥ పరదుస్సహని*ష్ఠురనిజరోచిః |పరిభూతశతకోటి* ఖరకరమండల ॥ మభ ॥ ౨॥ఇతరప్రహరణా*ప్రతిహతసంరంభ |కృతసర్వభువనా*తతపరిక్రీడన॥మభ॥౩॥జానకిరామాభి*ధానాశ్రితహృదయాసుగతారిసం*హారణధురంధర॥మభ ॥ ౪॥

శంఖస్తవము-సురట - ఆది.

పాంచజన్యమునుఁ*బ్రస్తుతించెదను* బ్రత్యహంబుమదిని ॥అ ॥ సంచలితాఖిల*జగదండనినదో | దంచనమూర్ఛిత*దనుజసైన్యమును॥పాం॥౧॥కమలాధిపకర*కమలమురాళ | భ్రమదమునమర*ప్రమదాస్పదమగు ॥పాం॥క్రూరపంచజన * కుక్షిశుక్తి ముక్తా[illegible]సుకృత * కదనయత్నమును॥పాం॥౨॥జానకిరామదా *సమనశ్చకోరక | శానిధి మండల * మైనెగడుశ్రీహరి॥పాం॥౩॥

గదాస్తవము.—— బిలహరి- అట.

కౌమోదకినిఁగొల్చెద | నామదిలోన | కౌమోదకినిఁగొల్చెద ॥అ॥ శ్రీమాధవహస్త* స్థితమైచెన్నొందు ॥కౌ ॥కమలజాండభాం* డములసృష్టివిల|యములకిదినిమి*త్తముగా నమరిన॥కౌ॥౧॥ వసుధవప్రచక్రి*వాళనగముతన| కసదృశకంకణ *మననుతికెక్కిన ॥కౌ ॥ ౨॥మహితజగత్త్రయ*మానదండమై|ద్రుహిణాదులకుసం*తోషమొసర్చిన॥కౌ॥౩॥జానకిరామదు*స్సహవిపదగనిర్భి|దానశాతోగ్రశ*తారమోయనదగు॥కౌ॥౪॥

ఖడ్గస్తవము.——జంఝూటి. ఆది.

నందకంభజేత్రిజగదా ॥నం॥ అ॥ ఇందిరారమణ * సుందరకరగత ॥నం॥దనుజవధూముఖ * వనజాతవికా| సనిరసనోదిత* చంద్రఖండమివ॥ నం॥౧॥ ద్విషదసుపవనో*జ్జ్వలవసముద్గత| విషధరమివరణ *వీథిదురీక్షం॥ నం ॥ ౨ ॥కలుషతూలసం * ఘాతదిధక్షో| జ్వలదనలోగ్ర* జ్వాలాంకురమివ॥నం॥౩॥ జానకిరామమ*నోనాగమహా | లానదండమివ*లసమానరహృది॥నం॥౪॥

శార్ఙ్గస్తవము.——ఖమాచి- అట.

హరిశరాసనం*దురితనిరసనం*కరోతుమమశ్రీ॥హ॥అ॥పరుషదనుజసం*హారణలసనం ॥ హ ॥ ఘనతరమౌర్వీ * జనితనిష్ఠుర | స్వనవినిర్దళిత * సకలదిగంతం॥ హ ॥

ఆచమనీయము.*** తోడి. ఆది.

ఆచమనీయం * బట్టించెదనుచ * రాచరూపునకు ॥ అ ॥ మేచకాంగునకు * వే
దవేద్యునకు । శేషశయనునకు * శిష్టవరదునకు ॥ ఆచ ॥

మధుపర్కము.*** ఆనందభైరవి. ఆది.

మధుపర్కంబును * మర్పణఁజేసెద * మధుసూదనునకును ॥ అ ॥ విధివాసవముఖ *
వినుతచరణునకు । విధువదనునకిపుడు * సుధానిలయునకు ॥ మ ॥

స్నానము.*** సావేరి. రూపకము.

స్నానముఁ జేయించెద శ్రీ * మానసచోరునకు ॥ అ ॥ సూనపరిమళ మిళితపరి *
శుద్ధతరంబగు సలిలము । మానుగ బంగరుకలశస * మాజంబులనిడుకొని నే ॥ స్నా ॥

వస్త్రము.*** అసావేరి. ఝాపు.

కాంచన చేలము లర్పణఁజేసెద * పాంచజన్యధరునకు ॥ అ ॥ చంచ దృఢులను *
దంచితమగు క్రొ । మ్మించు వైఖరుల * మించిచెలంగెడు ॥ కాం ॥

యజ్ఞోపవీతము.*** రేగుప్తి. అట.

సలలితమగు యజ్ఞోపవీతములు * చక్రికొసంగెదను ॥ అ ॥ వెలలేనిసకలమ * ణు
లమూల్యముల చేత । వెలయు కాంచనసూత్ర * ములనురచించిన ॥ స ॥

శ్రీగంధము.*** బిలహరి. అట.

శ్రీగంధం బలదెద శేషాచల * శిఖరస్థితునకిప్పుడు ॥ అ ॥ చాగైనకస్తూరి * పన్నీరు
పునుగుల । తోఁగూడిదివ్యాంగ * రాగమై వాసించు ॥ శ్రీ ॥

ఆభరణము.*** ఆనందభైరవి. ఆది.

మయార్పితం గృహాణభగవన్ * దయావరమురాకే ॥ అ ॥ శ్రియాసహితదు *
గ్ధియామగోచర ॥మ॥ మంజులరత్నస * మంజనవధునా । మంజీరద్వితయ * యంజగత్ప్ర
భో ॥ మ ॥ ౧ ॥వరనితంబవిధు * పరివేషంఘన । తరమణికాంచన * దామసమిద్ధం ॥
॥మ ౨॥కరవలయద్వయ * మరుణకిరణధి । కరణనిపుణ ఘృణే * గణనీయమిదం॥మ ॥
॥౩ రంగదమలమణి * సంగతమతిలలం । మంగళాయతన * మంగదయుగళం ॥మ॥ ౪॥
హారితద్యుతిసం * భరితదిగంతం । మగకతికర్ణా * భరణద్వయమిద॥ మ ॥ ౫ ॥ తంళితకౌ
స్తుభ * తరళముదారం।సురుచిరహారో * త్కరమభిరామం॥ మ ॥ ౬॥ మేరుశిఖరస * న్నిభకి
రీటం । చారుమకుటమిహ * సంతతశుభదం ॥ మ॥ ౭ ॥ధ్యానవశేనప * దానతిభా
జా । జానకీరామాభి * ధానేనసదా ॥మ ॥౮॥

పుష్పం. శుద్ధకాంభోజి. ఆది.

పూజలుగావించెదసంపుల్లాం * భోరుహతునేవుదు ॥ అ ॥ జాజులమొల్లల *
చాంపేయంబుల । రాజీవములవి * రాజమానముగఁ ॥ పూ ॥ చామంతులవిర *
జాజులతులశీ । దామంబులనతి * నేమంబుననేఁ ॥ పూ ॥ ౧ ॥ కరవీరములాది * గాఁగ

ల్గిన మేల్ | విరులు బంగరుప ❀ ళ్లెముల నిడుకొని ॥ పూ ॥ ౨ ॥ సలలితమగు మ ❀ ల్లెం నీలోత్పల | ములమందార ❀ మ్ములకమ్ముదమునఁ ॥ బూ ॥ ౩ ॥ వకుళకుసుమతుల ❀ వరసౌగంధిక | నికరములను కే ❀ తకీప్రసవములఁ ॥ బూ ॥ ౪ ॥ పున్నాగాదిసు ❀ పుష్పంబులనేఁ | జెన్ను మీఁగ సు ❀ స్థిరమానసమునఁ ॥ బూ ॥ ౫ ॥ సమధికశ్రీకే ❀ శవాదిశుభనా | మములమనోజ్ఞ ❀ క్రమమింపొందఁగఁ ॥ బూ ॥ ౬ ॥ శ్రీమద్వేంకటనగ ❀ శృంగసముంచిత | ధాముదివ్యతం ❀ నామావళిచేఁ ॥ బూ ॥ ౭ ॥ అనవరమష్టస ❀ హస్రనామముల | వినయమెసఁగసం ❀ పిీతియుతుఁడనై ॥ పూ ॥ ౮ ॥ రామాష్టోత్తరశత ❀ నామంబులను | ద్ధామభక్తినిఁ ❀ రామముగను నేఁ ॥ బూ ॥ ౯ ॥ వరకృష్ణాష్టో ❀ త్తరశతనామము | లగముఖాదిపున్నై ❀ లక్ష్మీ [మననునేఁ | బూ ॥ ౧౦ ॥

శంకరాభరణము. అట.

పూజయామి భోగిశ శయనం ❀ పుండరీకనయనం ॥ అ ॥ రాజవదనమిభ ❀ రాజవరదం | రాజమానతిను ❀ భాజితశరదం ॥ పూ ॥ సురుచిరనిరుపమ ❀ సుగుణాలవాలం | మురరిపుని చయభీ ❀ కరకరవాలం ॥ పూ ॥ ౧ ॥ పరిణతజ్ఞానస ❀ భగణసుశీలం | ఫణిధాత్రీధర ❀ భాసురఖేలం ॥ పూ ॥ ౨ ॥ సంతతార్యనత ❀ జానకిరామం | కంతుసుందరా ❀ కా [రాభిరామం ॥ పూ ॥ ౩ ॥

కాఫీ. అట.

హరిపూజఫలమిట్టిదని నుడువఁగనే ❀ న్వరివశంబిలను ॥ అ ॥ పరులఁదనిమిభక్త ❀ వరవర్గమున కశ్రీ | కరుఁడగుచును శేష ❀ గిరిని వెలయు | శ్రీ ॥ హ ॥ చరణయుగళముఁ ❀ సరసిజమత్స్యరేఖ | దురముఖరేఖలు ❀ మెరయుచున్న ॥ శ్రీ ॥ హ ॥ ౧ ॥ కటితటమునను ❀ తప్తటముగ కాంచన | పటము తటిన్నిభ ❀ ముగాఁ జెలఁగెడి ॥ హ ॥ ౨ ॥ ఉరమునహారని ❀ కరముగ వనమాలిక | సిరి యురు శ్రీవత్స ❀ చిహ్నముగల్గిన ॥ హ ॥ ౩ ॥ కరచతుష్టయమున ❀ నరిభీకరచక్రి | దరగదాదిసా ❀ ధనములఁబూనిన ॥ హ ॥ ౪ ॥ జయలక్ష్మిమణిమయో ❀ జ్జ్వలకేళిసాధముల | శ్రీకరఁదేజరిల్లెడి ❀ కేయూరములుగల్గు ॥ హ ॥ ౫ ॥ వదనాబ్జమున మృగ ❀ మదతిలకము తు | మ్మెదకరణి పెంపు ❀ పొందవుచున్న | శ్రీ ॥ హ ॥ ౬ ॥ కలితకపోలరం ❀ గస్థలమున కుండలరుచినర్తకి తాం ❀ డవముసల్పఁగనొప్పు ॥ హ ॥ ౭ ॥ శిరమున ధరియించ ❀ చినముకుట ద్యుతు | లరవిందసఖసాదృ ❀ శ్యమునందఁదనరెడి ॥ హ ॥ ౮ ॥ వరకటాక్షము ❀ ఖరుక్షం ❀ బరికరే పోతరాజ్జా | నకిరామాఘధ్వాంత ❀ ప్రకరమునడఁచిన ॥ హ ॥ ౯ ॥

ధూపము. ❀❀❀ నవరోజు. ఆది.

ధూపములను ❀ శ్రీపతిదేహము ❀ వ్యాపింపఁగఁజేతుఁ ॥ అ ॥ కాపిలఘృతశ్రీ ❀ ఖండాదులసం | దీపితమైదశ ❀ దిశలనుగప్పిన ॥ ధూ ॥

దీపము ❀❀❀ కేదారగౌళ-రూపకము.

దీపముద్యోతజ ❀ ద్వ్యాపకునకు నిత్తును ॥ అ ॥ తాపసీయభాజన సం ❀ స్థాపితమై సకలభువన | పాపతిమిరమార్తాండ ❀ రూపమగుచుఁ జెలఁగుదివ్య ॥ దీ ॥

కరివరావనాయసర్వ* ఖలజనాళినిగ్రహాయ । సురగణానుగ్రహాయ * శోభనంసదా సూ॥౨॥ దురితదూరాయశేష * ధరణిధరవిహారాయ । సుమచితానహాసాయ *శో భనంసదా॥సూ॥౩॥ పోతరాజజానకిరామ * పోషణగుణశోభితాయ । సూతికధితసుచ మంత్రపుష్పం*** మధ్యమావతి. ఆది. [రితాయ * శోభనంసదా ॥సూ॥౪॥

మంత్రపుష్పంబొసంగెదంద్రిభువన *మంగళచరితునకు॥అ॥సంతొసమడంచిభక్త *సంరక్షగావించుసర్వ ।తంత్రఘటితాఘటన పటుస్వ*తంత్రశంకరంజిల్లుస్వామికి॥మం॥ ఆత్మప్రదక్షిణనమస్కారము *** పంతువరాళి ఆది.

నమస్కారంబొనరించెదనవ *నలినదళాక్షునకు ॥అ॥ భ్రమచేతనునేఁజేసిన యవ రా*ధములకృపాపాంగ విలోకనముల । క్షమసేయుమ నుచునాత్మప్రదక్షి * ణము రాజోపచారములు.*** జంఝోటి. అది. [లొనరించుచుమాటిమాటికి॥న॥

రాజోపచారములంగైకొనుము * రాజీవనయనా ॥అ॥ రాజమానపి * రాజహా యసుర । రాజకైరవ * రాజమత్కృత ॥ రా ॥ అతిలమౌక్తిక *జాలకలితము । శ్వేతఛత్రము * ప్రీతినొసంగెద ॥రా॥ ౧ ॥సోమకిరణగంం * చారకంబై లుతుఁ॥ మరములనేఁ* జైక్కఁగవై చెద ॥రా॥ ౨॥ చందనజలకణ * సౌరభశైత్య। మగువ్యజ *నమువసిచెద ॥రా॥ ౩॥ ముందరనిలచిప్ర*మొదంబునమణి।సుందరదర్ప ణ * ముందర్శించెద ॥రా॥ ౪ ॥ స్వనాట్యానుపూ* ర్వకదివ్యవధూ । జననాట్యము పా*యనముగసల్పెద ॥రా॥౫ ॥ శ్రోత్రస్మార్తపు * రాణసూక్తస్తోత్రభవన్నామ* కీర్తనసల్పెద ॥రా ॥౬॥ చారుతూర్యరవ * సహకృతమర్దల। భేరీనినదము *నూరిమిం జేసెద॥ రా ॥౭॥ జానకిరామదా *సమనోభీష్టని । ధానమధురతర * గానముఁజే నాటకురంజి- ఆది. [సెద॥ రా॥౮॥

సుమహితోపచారములంగైకొనిము * దమునొందుమదీశా॥అ॥ కమనీయశేషా* గశరణశ్రీరమా । రమణజానకీ* రామదీక్షితకృత ॥సు ॥౧॥ సమధికాతప*త్రముచామ రయుగళముమణిదర్ప*ణము।దివ్యవ్యజ।నముసుందరనా*ట్యము।మఘరగా।నముతూర్యని స్వ*నము।భేరీనిన । దమువృదంగఘో* షము పురాణపఠ। నముభవత్కీర్త*నంబుము శుద్ధసావేరి- త్రిపుట. [దలుగ॥సు॥

నుతియింతునెపుడు । నెమ్మనమున ॥ ను॥అ॥ క్షితినిదేవునిపం * మతినెంచినంత నే ॥ హితతపఃపూజాదిసకల* వ్రతములందలికొదువలతిశయ । గతులపూర్ణతనొందు నంద్రా* పతితపావనచరితు నిచ్చలు॥ను॥మతిజాలమిసజనులు*మంత్రతంత్రములందు।న తిలోపములొదవిన*నాదరమునను ॥ సుతులులోపములెన్నిచేసిన *మతలిదండ్రిలబలెస హింపుచు । హితములనుదయసేయుదుర్దమ* దితిజమర్దనుఁడైనశౌరిని ॥ ను॥౧ ॥ ఏలాటి నోములు*ఏలాటినిష్కృతులు । నేలాటిదానము* లెట్టిసత్క్రియలు॥ చాలఁజేసిననెవని వినుతిసిఁ* బోలవందురఖండరతినే। నోలినట్టిమహానుభావుని * లీలలనునిరతంబునెమ్మది

॥ను॥౨॥ రాజితగతిపోత * రాజ్ఞి జానకిగాను । భ్రాజిష్ణువగు చిత్ర * రాజీవమునను॥ తేజమున నివసించి చేతవ * రాజియావనతత్క్రతోన్నత । పూజలకు ముదమందు పన్నగ * రాజ (భూధరరవ్యావాసుని॥ ను ॥౩॥

బేగడ. జుల్వా.

రాముల సేవ గల్గెను * నన * కేమి కొదువయికను॥ సీతా రాము ॥అ॥ హేమకమలకోశపాణి * యైమనోజ్ఞముగను సీ। తామహాదేవి వామాంక * సీమను చెలువందనెసఁగు ॥రా॥ కరసరోరుహముల చారు * తరసితాతపత్రమంది । భరతుఁడతిముదమున దక్షిణ * భాగమున వసింపఁదనరు॥రా॥౧॥ సముచితముగ వామపా * ర్శ్వమున శత్రుఘ్నుఁడిందు । విమల చామరమున మెల్లన * వీవఁదీవిఁ దేజరిల్లు॥రా॥౨॥ గాలిచూలితోడ ల * క్ష్మణుఁడు తా పవిత్రయుక్తుఁ । డై లసత్కరములు మోడ్చి * లీలనెదుట నిలువఁజెలఁగు॥రా ॥౩॥ కామితములొసంగ వేడ్క * లోమెలంగ జానకీ । రామదాసపుణ్యనిచయ * రాశియనఁగ నింట వెలయు॥రా॥౪॥

## శ్రీనివాసదశావతారస్తవము.

మత్స్యావతారము. *** కం॥ శ్రీనయనసదృశరూపముఁ । బూనుటకో యనఁగ నబ్ధి * పూర్ణములోనన్ । మీనంబై యలమేల్మం । గానాథుని పాదవినతిఁ * గావింతుమదిన్॥

శ్రీ రాగము-అట.

మనమునఁదలచెదను * మత్స్యాత్ముని । ఘనముగఁ గొలిచెదను॥అ॥ వనధిఁజొచ్చి సో * మకుని ద్రవ్వి వేదము । లను దెచ్చి చతురా * స్యునకిచ్చి దర్వీక॥ రన కంధరమందు లక్ష్మీ * రమణితో నివసించి భక్తుల । కనుదినంబభివాంఛితార్థము * లను ముదంబున నొసఁగు సామిని॥మ॥

కూర్మావతారము *** కం॥ తనమూపున మంథరగిరి । ననుపమముగఁ దాల్చి సురల * కమృతముఁ బొడమిం । చిన కమఠాత్ముని శేషా । ద్రినివాసుని సంతతము ను * తింతు మనమునన్॥

సౌరాష్ట్రి- ఆది.

కమఠాత్ముని నే * గణుతించెదన్ । మదిని । విమలాత్ముని నే * వినుతించెదన్॥ అ ॥ అమృతార్థమమరాసురలు * గుములై క్షీరపారావా । రము మథియింపమంథన * గము గ్రుంగ పృష్ఠభా॥ గమున తదగమప * రిమితధృతిని దా । ల్చి మహితఫణిశుధ * రమున వెలయు శ్రీ ॥క॥

వరాహావతారము *** కం॥ దనుజయకృత్తుండమనం । గనలరుధర కొమ్ము కొనను * ఘుటియించి జగ । ద్వినుతిఁ గనినట్టి కిటిరూ । పుని దర్వీకర నగాధి * పుని సేవింతున్ ॥

ఎదుకుల కాంభోజి- ఆది.

వారాహదేవుని నే * వర్ణించెదన్ । మదిని । క్షీరాబ్ధిగేహుని నేఁ * జేరి కొలిచెదన్॥ అ॥ ధారుణిఁ గొని పారా * వారములోన వైవ । నేరూపున ముకనక * నేత్రుని ఘోరతనువుఁ జీరి కోరనా * క్షితిని దాల్చి మహి । తోరగాద్రినిలయుం డై భాసిలు॥వా॥

నరసింహావతారము *** కం॥ కలితకరనఖరములను । త్పలదళమును బోలిదనుజు * పటుతరవక్షః । స్థలమునతిరోషమున వ్ర । క్కలు చేసిన నృహరి నహీన * గపతి భుజఁదలఁతున్॥

శహన- ఆది.

నరసింహరూపునకు నే* నతులొనరించెదన్ ॥శ్రీ॥న॥అ॥ఉరుతరమగు స్తంభం* తరమున వెడలి దైత్యే। దరమును ఖరనఖరశి*ఖరముల వ్రచ్చితత్సుతు ॥ నరసిబ్రోచిసర*సిరుహభవపురం।దరులుగొల్వఫ ణి*ధరమున వెలసిన ॥న॥

వామనావతారము*** కం॥అలఘుపదంబుల ఘనభ।ములనాఁగి బలిన్విలాస*ముమెరయఁగరసా। తలమునకుద్రొక్కినవటునిఁ। దలచెదవేంకటనగేంద్ర*ధామునని శమున్॥

మారువ. రూపకము.

వామనావతారుని నే*వర్ణించెదనెపుడు। శ్రీమనోవిహారుని నేఁ* జింతించెదనెపుడు ॥ధీమహితుని బలిదానవు*భూమి పదత్రితయమడిగి। నామావశేషితుగా* నాగలోకమునకనిచిసు॥త్రామునిత్రైలోక్యసార్వ*భౌముని గాఁజేసిభక్త। కామితఫలదాయకుఁడై* కాకోదరగిరిని వెలయు ॥వా॥

పరశురామావతారము*** కం॥ ధరణిఁగలరాజలోకము।నిరువదియొకమారుపరశు* హేతికిఁబలిగాఁ। బరపిసభృగురామాకృతి।ధరునిన్ దర్వీకరాద్రి*ధామున్ గొలుతున్॥

శుద్ధసారంగ. ఝాపు.

పరశురామావతారుని*భావించెదన్।శ్రీ।నిరుపమానశరీరుని*నెమ్మిఁగొల్చెదన్॥ అ॥ధరణిస్థలినిక్ష* త్రముగనుజేయ। నిరువదొక్కమారు* గురిగను ధాత్రీ॥ శ్వరవర్గము నుపర*శ్వధధారను వేగ।నరికిపన్నగరా*డ్గిని వెలసిన। శ్రీ॥ ప॥

రామావతారము. *** కం॥ ధరణిజకై దశకంధరు। శిరములు కందుకముల్లట్లు* క్షితిఁగూల్చిమహా। త్తరుఁడైన శ్రీరఘూద్వహు। నురగాద్రిదరీవిహారు* నూ
[హింతుమదిన్॥

కళ్యాణి. త్రిపుట.

శ్రీరఘురాముని* సేవించెదన్। మదిని। వారిదశ్యాముని* వర్ణించెదన్॥ అ ॥ కూరిమిమీరఁగ* వారిజాప్తవంశ। వారిధికంబుజా* తారియనఁగమించి। నారీరత్నము సీతకై దే* వారివర్గనిదారియైశుభ। కారియై భుజగాచలేంద్రవి* హారియై చెలువొందు దేవుని ॥ శ్రీ ॥

బలరామావతారము.*** కం॥ అమృతాంశుమండలంబున। నమరినచిహ్నం బనంగ* నశితాంశుకమం। గమునదలుకొత్తు రేవతి। రమణుని నుతియింతు నుర
[గ*రాడ్గిరిపదమున్॥

అఠాణ- ఝంప.

బలరామమూర్తి నేఁ* బ్రణుతిఁజేసెదను।విలయాకృతార్తి నే* వినుతిఁజేసెదను॥ అ ॥ హలముసలములప్రవలం* బాదిఖలతతినియమ। నిలయమునకనిచిచిల్వ* మలనువిహరించుశ్రీ॥బ॥

కృష్ణావతారము. *** కం॥ లోకాద్భుతజారత్వముఁ। గైకొనిగోపకపురంధ్రి* కాతతితోఁ క్రీ। డాకలితుఁడగుచు వెలసిన।శ్రీకృష్ణాకారునహిగి*రిప్రభునెంతున్॥

సావేరి. ఆది.

శ్రీకృష్ణాత్మునిఁ * జేరికొలిచెదను * చిత్తములరఁగను ॥అ॥ప్రాకటముగచతురాస్యుని * ప్రార్థనఁ గైకొనిదేవ । కీకాంతగర్భమున * శ్రీకరముగనుదయించి । లోకకంటకులన * స్తోకబలంబున । పీకనఁడచిగోపి * కా కామినులతోఁ గ్రీ । డాకలితుండై * లోకఖ్యాతికిఁ దగుచుదండ * శూరకగిరీశుఁడౌ ॥ శ్రీ ॥

బుద్ధావతారము. *** కం ॥ త్రిపురాసురహతికై త । చ్చపలాక్షులభంగపరచ * జగతినిబౌద్ధా । ధవరూపముఁదాల్చినహరి । నృపకుధరాధ్యక్షుభక్తిఁ * జేరికొలి [చెదన్ ॥

కన్నడ. ఆది.

బుద్ధాత్మునినేఁ * బూజించెదన్ । వరి । శుద్ధాత్మునినే * స్తుతియించెదన్ ॥ అ ॥ శుద్ధిదనరత్రిపుర * సుదతులఁజేరివారి । బుద్ధులుచెరచిభుజగ * భూధ్రమునఁ జెలగు శ్రీ ॥ బు ॥

కలికావతారము *** కం ॥ కలిదోషాకులమగుభూ । తలమున ధర్మంబు నిలుపఁ * దలఁచిసమంచ । త్కలికాకృతిధరియించిన । ఖలసంహారుఁదలఁతువన్న * గగిరిపతిన్ ॥

పున్నాగ. ఆది.

కలికాత్ముని నుతిఁ * గావించెదన్ । శ్రీ । కలితాత్మునిమది * కాంక్షించెదన్ ॥అ॥ కలికాలదోషా * కులమగుధరణీ । స్థలిని ధర్మమునిలుప * దలఁచి శేషాద్రినలరెడు ॥క॥

దశావతారస్తబకము—. కం॥ మీనకమఠకిటిహరివటు । మానవవరహరదశాస్య * మర్దనబలన । త్యానాథబుద్ధకలికివి । జానకిరామావనాథు * జగగిరిసదనా ॥

సురట. ఆది.

శ్రీనివాసమూ * ర్తిని భజియించెద * శేషాచలపతిని । భావించెదభక్తావనరతిని ॥ అ॥మీనకమఠకిటి * మృగరాడ్వటునృథి । పీనాథహరఘు * వీరహలధరబ । లానుజబుద్ధకలి * కాత్మునిపోతరా । జానకీరామదాస * ధ్యానగమ్యు ॥శ్రీ ॥

## శ్రీభగవదాపాదమస్తకస్తవము.

శంకరాభరణము. ఆది.

నారాయణుపద * నలినములను నెర * నమ్మి భజించెదను ॥ అ ॥దారుణ దురితాంధ * కారసమూహాసం । హారోద్యదినమండ * లాభిరామములగు ॥ నా ॥ ఘనముగ ముక్తికా * మిని క్రీడకై యమ । ర్చినరత్న వేదిక * లనఁగ నింపొందెడు ॥నా॥ ౧॥ పల్లవములు నిజ * ప్రచుర ప్రభాసం । పల్లవములనంగ * ప్రబలుచునుందు శ్రీ॥ నా॥ ౨ ॥ శ్రుతివధూసీమంత * వితతవిధీవిర । చిత సింధూరవి* శేషకములననొప్పు ॥ నా ౩ ॥ఉరగింద్రఫణపాదు* కోపరిసీమల । నురుమణిద్యుతులతో*నొరసిచెలంగెడు ॥నా॥ ౪ ॥ జానకీరామదా*సమనోమయపీ । ఠీనిషణ్ణములన*హీనాద్రిపతియగు ॥ నా॥ ౫ ॥

శుద్ధకాంభోజి. చాపు.

నఖములు చెన్నొందెను । శ్రీహరిపాద॥న॥అ॥ అఖిలలోకావనో * న్ముఖములు తారకా। నఖములువికసిత *నఖవన్ముఖములు॥న॥ పదములుదశవిధ * పల్లవవిజయా। భ్యుదితయశంబుల * నొనరసినవైన॥న॥౧॥ఉపచితలావ * ణ్యోదధిమధ్యగ। ప్రపదద్యుతులీసము*త్పన్నాండములన॥న॥౨॥ సరసిజములుపద*జన్మమంచిహిమ। కరుప్రచ్ఛిదాళ్ని * కళలోయనంద్ధగి॥న॥ ౩॥ జానకిరామదాస *మానసనివిడత। మోని వర్గకము * [ప్రైనదీధితుల॥న॥౪॥

పంతువరాళి. ఆది.

హరిజంఘల సంస్మరించెద। శ్రీ॥హ॥అ॥ పరిహృత దుష్కృ* భవసంఘల శ్రీ॥హ॥ ఇలవిబుధకృషీ * వలసుఖదములౌ। కలమగర్భంబుల * కవ డింజెలంగెడు॥హ॥౧॥ సకలజగజ్జన * జాలజయసము। త్సుకుండౌసుమశరు * తూణములవందగు॥హ॥౨॥స్థిరమునిముక్తిస *తీవివాహోవ। సరభద్రికాహళ * సంశయమును జేయు॥హ॥౩॥సూరిమితో జాన*కీరామాఖ్యవం। దారుండుకోరిన*కోరికలొసంగునట్టి॥హ॥౪॥

నాటకుర్వంజి. చాపు.

ఊరువులందలంతు। కమలోద॥ రోరువులందలంతు॥అ॥ వారణశుండా * కారచారువుల॥ నూరు॥ వనధిసుతాసం * వహనోచితముల। కనక వసనసం * గతి శోభితముల॥ నూరు॥౧॥ అన్యోన్యసారూ * ప్యాన్వితముల జగ। న్మాన్య లావణ్య శ్రీ* మండనాంచితముల॥ నూరు॥౨॥సద్భావసరవణి*గ్జన్మకారణముల। దుర్గమాత్రిసం* దోహదారణముల॥ నూరు॥౩॥జానకీరామదా* సధ్యేయములవై। మానిశపవిరస*మా [జగేయముల॥ నూరు॥౪॥

కళ్యాణి. ఆది.

కటితటమునుగొలుతు। శ్రీహరి॥క॥అ॥ ఘటిత చటులతర * కాంచన పటమును॥క॥ కాంతవర్తులా *కారాన్వితమై। కంతునిగ్రథన* ప్రకంబననొప్పెడు॥క॥౧॥అతులితసౌంద*ర్యరసధునీసము। దితసైకతమన *నతిమనోజ్ఞమగు॥క॥౨॥పరివేషముకై*వడినానామణి। వరమేఖలవి*స్ఫురింపనొప్పెడు॥క॥౩॥జానకిరామదా*ససమ్మోదకర। మైని [రంతర* ధ్యానగవ్యమగు॥క॥౪॥

శహన. ఆది.

ఉదరమునుతించెదను। శ్రీవిభు॥నుద॥అ॥ముదంబొదవనా * మదిందిరంబుగ॥నుద॥ చతురాస్యమధు * వ్రతడింభసమం। చిత నాభీసర* సీజాన్వితమగు॥నుద॥౧॥ సంతతవృధులా * నంతకోటివా। క్యాంతాండైకని* శాంతంబైతగు॥నుద॥౨॥ భాసురవక్షో * వాసకమతుకప। ద్మాసోపానో * ద్యద్వళి యుతమగు॥నుద॥౩॥ జానకిరామదా * సఫలదకల్పల। తానవద్యరో * మావళి యుతమగు॥నుద॥౪॥

బేగడ. అట.

శ్రీరమణునివిశా*లోరస్థలముమా*కోరికలీవుతను॥అ॥ తారవృధులము*క్తారచిత మహా।హారలసత్కౌస్తు* భాలంకృత మగు॥ శ్రీ॥మహితసంపదభి*మానదేవతా।మహని

య్యావిహార*మంటపమైతగు ॥శ్రీ॥౧ ॥అమితాంతస్థితా*జాండాగమనిర్గమవిరచితజా* గ్రత్కవాటమైన॥శ్రీ॥౨ ॥సౌరభాస్వాదఝుం* కారిమధుపసుకు।మారామ్లానవన*మాలాశ్రియమగు॥శ్రీ॥౩॥జానకిరామదా *సతతభద్రసం।తానప్రదానైక*తానమైచెన్నొందు ॥శ్రీ॥౪॥

సావేరి. ఆది.

హరిభుజములనాశ్రయించెద । శ్రీ॥ హ॥ అ॥ పరిధృతచక్రాది * ప్రహరణవ్రజముల ॥ హ॥ కనకాంగదసం *గతములై సౌదా । మినిపరిష్కృతనవ * ఘనరేఖలనొప్పు ॥ హ॥౧ ॥ వరవిజయశ్రీ*మరకతసౌధశ్రీ । ఖరసంశయదాంస* పరిశోభితంబుల। హ॥ ౨ ॥ దైతేయ విభవకం * జాతసముత్పాట । నాతతకరిశుం * డాభిరామముల ॥ హ॥౩॥జానకిరామదా*సమనోభీష్టప్ర। దానోచితకల్ప*తరుశాఖలనందగు॥హ ॥౪॥

జంఝూటి. ఆది.

గళమగళితమం* గళమీవుతను । హరి॥ గ॥ అ ॥ సలలితముక్తా * వళిసంవళితము॥ గ॥ లోకాతిశయరే * ఖాకలితముల। శ్రీకరకంకణ * చిహ్నాన్వితము॥గ॥౧ ॥ మధురస్వరామృత* మానసీయముమ । న్మథజయశంఖభ్ర * మప్రదాయకము ॥గ॥ ౨॥ నారదాదిముని* నాథనంద్యముజాన। కీరామసతతసం* కీర్తనహృద్యము॥ గ॥౩॥

కాఫి- ఆది.

అధరమువర్ణించెదను। శ్రీధరు ॥నధ ॥ అ॥ అధికసుధారస * మధురిమనలరి॥ అ ॥ వనధిసుతాశుక * వనితాబింబం। బనందగిన్పృధుశో*ణాభాంచితమగు॥ నధ ॥౧॥ వదనోజ్వలరుచి * వారిధిశీమ । భ్యుదితవిద్రుమ* బోయనెనఁగెడు ॥ అధ॥ ౨॥ జానకిరామదా * సకలుషతిమిరవి । తానదళనర* త్నదీపమనఁదగు॥ నధ॥ ౩॥

నాధనామక్రియ- ఛాపు.

హరినాసికనే * నభినుతింతుసు* స్థిరమతితోనెపుడు ॥అ॥వరసుగంధిని * శ్వాసగంధవహ । సురభితహరదం * తరమైదనరెడు ॥హ॥ చతురభ్రూయుగ * రతిపచాపమాధ్యతలస్థితనళి * కాతికాంతమగు॥హ॥౧॥దశనమణితులా* దండంబననస।ద్పశతిలసుమసం*దీప్తివహించిన॥హ ॥౨॥ జానకిరామదా*సఘనాఘాళివి । ధూనచంపక *
[సూనమనఁగఁదగు ॥ హ॥౩॥

శుద్ధసావేరి- ఛాపు.

నలినోదరునయ * నములభజించెద *కలుషములుదొలంగ। మదియుప్పొంగ॥న॥ అ॥ కలశాబ్ధితరం *గప్రతిమసము। జ్వలకటాక్షవీ*క్షామధురములగు॥ న ॥ కమలకయిరవో*త్కరవికాసకృ।త్సమధికతేజ*స్సముపేతములగు ॥న॥౧॥ ఆరక్తోపాం*తాకర్ణాంత।స్ఫారరుచిరశో*భారమ్యములగు॥న॥౨॥జానకిరామాభి*ధానదాసచే। తోనితాంత
[సం*తోషకరములగు ॥న ॥౩॥

సౌరాష్ట్ర- త్రిపుట.

గరుడధ్వజుకర్ణములఁదలంచెద *కళ్యాణములొదవ।ముదమొదవ॥అ॥వరవదనశ్రీ *వాచకార్ణముల।కరణినతిమనో*హరతఁజెలంగెడు॥గ॥౧॥ తరుణకపోలా*దర్శబింబి

తో।న్మకరకతకుండల*పరిచిహ్నితములగు॥గ॥౨॥హరి దుత్పాదన*కరణంబులవిస్ఫుర
దంష్ట్రతటీ* పరిచుంబితముల॥గ॥౩॥సతతముపోతరా*జ్జానకిరామువి। నతుఁడౌనన్నువి*
ఎరుకులకాంభోజి. ఆది. [న్నపమాలించెదు॥గ॥౪॥

వదనముశోభా* సదనమునామది * ముదమొనరించుతను। శ్రీహరి॥ వ॥ అ॥
మృదుతరమంద*స్మితరుచివిస్ఫా।రదఖిలభువన*వ్యామోహకమగు॥వ॥ ఉరులలాటఫ
ల*కోర్ధ్వపుండ్రభా।స్వరరేఖాత్రయ*వర్ణనీయమగు॥వ॥౧॥ కమలాచుంబన*కాలకపో
ల। స్థలకరికాప* తిమ్ముద్రితంబగు॥వ॥౨॥జానకిరామదా*సచకోరకరా।కానిశాక
సురటి. ఆది. [ర*శ్రీనివహించెదు॥వ॥౩॥

మస్తకంబునా*మదిభావింతుస* మస్తశుభాప్తికినీ॥ అ॥ నిస్తుల మణిగణ*
నిచితకిరీటగ।భస్తినిరస్తవి*భాకరమౌహరి॥మ॥శమనస్వసృజల*జనితావర్త।భ్రమదైకా
వ* ర్తవిలసితంబగు॥మ॥౧॥అనుదినమునుస*న్మనులుత్రివిష్టప। మునుగానెమ్మన*ముల
భావించెటి॥మ॥౨॥పశుపతిమూర్ధ్నా*భ్రధునీస్పర్ధా।వశగతయామునా*వర్ణ్యచికురమ
గు॥మ॥౩॥సతతపోతరా*జ్జానకిరామదా। సతతమనోభీ*ష్టప్రదాయియగు॥మ॥౪॥

శ్లో॥ జిహ్వేకీర్తయకేశవంమురరిపుం చేతోభజశ్రీధరం। పాణిద్వంద్వసమర్చ
యాచ్యుతకథాం శ్రోత్రద్వయ త్వంశృణో। కృష్ణంలోకయలోచనద్వయహరేర్గచ్ఛాం
ఘ్రియుగ్మాలయం। జిఘ్రఘ్రాణముకుందపాదతులసీం మూర్ధన్నమాధోక్షజం॥

ఈశ్లోకార్థమునను సరించినకృతులు. [illegible]కం॥ రసననిరవధికవిషయ।వ్యసనములనుబడక
భక్త*వత్సలువిలస।ద్బిసరుహనేత్రునిశేషా।ద్రిసదనునిస్నేపొద్దుసంస్తు*తింపుముభక్తిన్॥

నాటకురంజి. ఆది.

రసనేకీర్తయ * రఘురామం॥అ॥ అసురసంహననం *వసుదసంహననం॥ ర॥
కార్ముకధరణం* కనకాభరణం॥ర॥౧॥ రచితసహాహావం * రక్షితమహాహావం॥ ర॥
౨॥ దశరథతనయం*తతవిదితనయం॥ర॥౩॥ కంపితశరధిం*ఘనతరశరధిం॥ర॥౪॥
జగన్నుతచరణం* నిగమసంచరణం॥ర॥౫॥ తపనీయవసనం* ధర్మనివసనం॥ర॥౬॥
సుగుణాలంకరణం*సురశుభకరణం॥ర॥౭॥ బిసరుహనయనం*వృజినాపనయనం॥ర॥
౮॥భద్రాద్రిశరణం* భక్తౌఘశరణం॥ర॥౯॥ శ్రితజానకిరామం*శ్రీజానకిరామం॥ర॥౧౦॥

శా॥ ఏకప్రక్రియమీరమానసమనీ * వేవేళసద్భక్తితో। శ్రీకాంతున్జగదం
తరాత్మునఖిల* శ్రేయస్కరప్రాభవో। ద్రేకున్ శేషనగాధినాయకునిసం * సేవిం
చి ఘోరాఘసం। ఘూంకూపారమునుత్తరింపుమిక సౌ*ఖ్యప్రాప్తి చేకూరఁగన్॥

శుద్ధసావేరి అట.

మానసభజశ్రీ*శ్రీనివాసం। హే॥మా॥అ॥ దానవవరసము*దయరణ
జైత్రం। మౌనికృతప్రతి* మానసస్తోత్రం॥మా॥పాటవధృత జగ* న్నాటక సూ
త్రం। కోటీరమణిరుచి * కుంఠితమిత్రం॥మా॥౧॥అహిగిరినాయక * మంబుజనే

త్రం । మహితశ్రీయలమే * ల్మంగాకళత్రం॥ మా॥ ౨ ॥ జానకిరామదా * సవినుతిపా త్రం । సూనశరాయుత * సుందరగాత్రం ॥ మా ॥ ౩ ॥

కం ॥ కరయుగవాగీశముఖా । మరమకుటభ్రాజమాన * మణిఘృణిపటలస్ఫురిత పదకమలు శేషకు । ధరనిలయుని పూజచేసి * ధన్యతఁగనుమా॥

బేగడ. ఆది.

కరయుగపూజయ * కమలారమణం ॥ అ ॥ నిరుపమఫణిరా * డ్గిరివరశరణం॥ క॥ జగదుదయస్థితి * సంహృతిహేతుం । ఖగపతిముద్రిత * ఘనతరకేతుం ॥ క॥ ౧॥ భవభయలతికా * పటలలవిత్రం । కువలయదళనిభ * కోమలగాత్రం ॥ క॥ ౨॥ దానవేంద్రతరు * దవశిఖికీలం । జానకిరామమ * నోనుగలీలం ॥ క॥ ౩॥

చం॥ సురముని గీయమానమతి * సుస్థిరసౌఖ్యనిదానమూర్తిసా । గరబడబానలం బఖిల * కామితకల్పకముగ్రికాలకిం । కరతిమిరప్రభాతమునఁ * గాఁదగు వేంకటశైలనాథస । చ్చరితసుధన్ శ్రుతిద్వయమ * సంతసముల్లసిలంగఁగ్రోలుమా॥

బిలహరి. ఆది.

శ్రుణుకర్ణద్వయ శ్రీ * ఫణిగిరీశచరితం । త్వం॥ శ్రు॥ అ॥ గణనాతీతమో * దసుధాభరితం ॥ భవసంచితదురి * తవనధితరణం । వివిధాపదగవ్రాత * విమత ప్రహరణం॥ శ్రు॥ ౧॥ పరమోపనిష * త్ప్రతిపాద్యమానం! పరమేష్ఠిముఖని * ర్జరగీయమానం ॥ శ్రు॥ ౨॥ శమనకింకరో * త్సాదననిపుణం । సమధికసుఖసం * గమన ప్రవరణం ॥ శ్రు ॥ ౩॥ జానకిరామదా * సానందకరం । మానితమాళీ * మండలముఖరం ॥ శ్రు ॥ ౪॥

గీ॥ వాణిమగనికాట * పట్టగునాభికు । శేశయంబువింత * చెలువొనర్ప। వేంకటాచలమున * విలసిల్లు శ్రీనాథుఁ । గనుము నేత్రయుగమ * కాంతఁదీర॥

ఖమాచి. ఆది.

లోచనయుగళవి * లోకయ కృష్ణం॥ అ॥ శ్రీచిత్తవిహారణం * సం * శ్రితభవసంహరణం॥ లో॥ దేవకీనందనం * నందితసనకసనందనం ॥ లో ॥ ౧ ॥ కౌస్తుభకలితకంధరం * తను * కాంతివిజితకంధరం ॥ లో ॥ ౨ ॥ కంసనరసిజవారణం * ఘన * కల్మషౌఘనివారణం॥ లో॥ ౩॥ విషధరారికేతనం॥ శ్రీ * వృషనగనికేతనం ॥ లో ॥ ౪ ॥ జానకిరామాభయదం * ని * శాచరభయదం ॥ లో॥ ౫॥

మ॥ చరణద్వంద్వమసర్వమానవులదు * ష్పాపంబులన్ దుంచియి । ద్ధగలో సార్థకనామమంది భువన * త్రయ్యార్చితంబయిమహా । ద్ధురతన్ వాటిలు వేంకటాద్రికైసం * తోషంబునన్ వేగనీ । వరుగన్నాదబెదుష్టవర్తనలవై * యర్ఘ్యంబునన్ జెందకన్॥

పున్నాగ. రూపకము.

యాహిచరణయుగశే * షాహిగిరివరం ప్రతి ॥ అ ॥ దేహినిచయఘనతరదు * ర్మోహనివర్తనచతురం ॥ యా ॥ పరమపదప్రతికృతిమివ * భాసమానం । స్థిరక్ష్మాసురగణసం *

సేవ్యమానం ॥ యా ॥ ౧ ॥ నిరుపమమణిమయకార్త * స్వరశిఖరగోదారం । భరితసృగి
మదసౌరభ * వాసితదిగ్వారం॥ యా ॥ ౨ ॥ అమరవధూజనవివిధవి*హారోచితకుంజం।
కమనీయసరస్సముదిత * కాంచనమయకంజం ॥ యా ॥ ౩॥ వనజనాభవరపద్మా* వళి
ముఖరితకీరం । ఘనతరదివ్యాపధిలతి * కాతతివిస్తారం ॥యా ॥ ౪ ॥ ప్రణతపోతరాజా
నకి * రామదాసహృద్యం । రణితభేరికా మృదంగ * పణవాదివాద్యం ॥ యా ॥ ౫ ॥
౬ ॥ నాసికశ్రీనివాసచర*ణస్థితిఁగాంచిత్రిలోకపావనం।బైసరసీజసంభవము*ఖామరవా
రకిరీటసేవితం।బైసమునగరివైభవము*నరిగనిశ్రీతులసీదళంబుపై।నాసయొకింతయుంచుమి
అఠాణ. ఆది. (క*నార్తినిఁజెందవు ధామణీస్థలిఁ॥
నాసికేశిఖరశ్రీని * వాసపాదతులసీం ॥అ॥ దాసనంతాప హారణ * భాసురసు
ధాసగసీం ॥ నా ॥ నిజపరిమళదళితలోక * నిచయవివశ వాసనాం । సుజనసంపత్ప్ర
దా*శోభనప్రయోజనాం ॥నా॥ ౧॥ కమలసంభవాదిదేవ* కనకమకుట భూషితాం।
సమధిగాఘశోషణప్ర * చారసంభావితాం ॥నా ॥౨॥ పోతరాజ జానకిరామ * పుణ్య
సంవర్ధనీం। ఖ్యాతవైకుంఠనగర * యానమార్గదర్శినీం ॥ ౩ ॥నా ॥
గీ॥ ఉత్తమాంగసతత * మురగాచలాధీశు। పాదపద్మములకు * బ్రణతిఁజేసి।
ఘోరదుష్కృతములఁ*బాయఁద్రోలుము మహా। పారనిత్యసుఖము* నందుదీవు.॥
కన్నడ. ఆది.
నమనస్త్రకశి * రణిగమణం ॥ ప ॥ విమతనిశాచర * విదళననిపుణం ॥న ॥శృ
తినూపురసం * శోభితచరణం । తతనాభిసము * ద్గమితదృహిణం ॥ న ॥౧ ॥కరసరసీరు
హ * కలితధనుర్గం । కరుణారసపం * భరితాపాంగం ॥ న ॥ ౨ ॥ జానకిరామమ
*నోనళినీనం। దీనజనోత్కర *నిత్యనిధానం ॥న ॥ ౩ ॥

శ్రీభద్రాచలయాత్రాసంకీర్తనము.

సీ॥ శ్రీమన్మహీసుతా* చేతోంబురుహమిత్రు*నిబిడామఘవల్లికా * నిశితదాత్రు।
భవధనుర్విదళన * ప్రకటితబలబాహు * వరదేహరుచిజిత* వారివాహు। రవికులాం
భోరాశి* రాకాసుధాధాము*ఖలరావణాదిరా*క్షసవిరాము। మునిభామినీశాప*వన
దజగత్త్రాణు*కరుణాకటాక్షవీ*క్షణధురీణు।రవ్యగుణసాంద్రుభద్రాద్రి* రామచం
ద్రు। పూర్వభవసంచితాశేష*మూరిసుకృత।నిచయమునవధిప్రేరేప*నిశ్చయముగఁగ
న్నులను గాంచువేడ్కలోఁ*గడలుకొనియె ॥ వ ॥ తదనంతరంబ॥మ॥ మలరాడ్వెంకట
గుండరాణ్మహిషిస* న్మాన్యవతాచారని।శ్చలలక్ష్మాంబికయుమ్మఁబ్రోచుకతేవ*సమ్య
క్తదాజ్ఞన్మహా।తల్లికగైకొనిబంధుమిత్రహరిభ*క్తవ్రాతయుక్తుండనై। విలసత్
మంగళవాద్యఘోషలెసఁగ*విప్రుల్ప్రశంసింపఁగ॥గీ ॥భద్రగిరినాయకుని పద*పద్మ
ములకు। నాంగిరసవత్సరసు * సురభిమాస। శుక్లపక్షాదిదినలస*చ్ఛుక్రవార। రా
త్రిబృందావనాఖ్యపు*రంబువెడలి॥

రేగుప్తి. అట.

. గిరిమభద్రాద్రికి * నరుగుమార్గక్రమము * సరసిజాక్షి వినవే। వేడ్క-మీర॥సర॥
అ॥ పరగునపోతరా*జ్జానకిరాముఁడు । వరమహర్షమున * హరిదాసులతోడ॥గ॥సర
విశార్వ గ్యబ్ద* చైత్రశుద్ధాదివా । సర రాత్రిబ్రం వావన* పురముఁ వెడలియా । మరునా
టిపగలుకొ* తరమ్ముప్రవేశించి ।నెరిభోజనానం * తరమునఁగుడివాడ ॥ కరిగిసాయం
కాలమునశ్రీ * హరినియతభజన మ్మొదనరిచి । త్వరిత గతినరుణోదయాన* సరమున
నుయ్యూరు వెలువడి॥గ॥౧॥అల్లకాను మోలుమ *ధ్యందినముఁ కేగి । వెలయనభ్రవహార*
విధిఁదీర్చి వేగళ । దలిమేలూరుమో * దమున రాత్రికిఁజని ।నిలచిమరునాడా* నెలవున
భుజియించి ॥ కలయతన్నగరీజనంబులు *గన్గొనఁగఁజను జేరితగయా । వలనయాశనగూ
డెమునకజ * వారమునపగలశనముండిని ॥ గ ॥ ౨ ॥ పూనికచింతల * పూడిసాయం
కాల। మానంతకేగిది *నాదినిపైనమై । వేసంతటదమ్మ* పేటనుగలయు। ద్యానవనస్థలి*
లోనభుజించిభ॥ యానకద్విపికోలగవయా*ద్యఖిలమ్యగగణసంకులంబై । మానియుతమ
గుదండకార * ణ్యానినంతటఁ గడచిముందట ॥గ॥ ౩॥

కం॥ శ్రీరామరత్నసికరో । దారవిమానాగ్రభాగ* ధగధగితరుచి । స్ఫారతర
చక్రమునురణ । దారితరిపుచక్రమునుము * దంబుఁగఁగంటిఁ ॥వ॥ కనిపునఃపునఃప్రణామం
బులుగావించి ప్రమోదపులకాంకరితశరీరుండనై చనునెడ॥

కేదారిగౌళ- ఛాపు.

గౌతమిసిసందర్శించితి* నా*కలుషము లెడబాసితి। నేటికినా॥కలుషము లెడబాసితి॥
అ॥ త్మ్మాతలమునకుస* మాగతయగువిర।జాతటినియనఁగ*సన్నుతికెక్కి-ఁ॥గౌ॥తనయంద
వగా* హనమాత్రమునసర్వ।జనదృఢతరలింగ * తనుభంగమును జేయు॥గౌ॥౧ ॥శైలన్మ
రాశైక* డోలాయితవీచి ।మాలానిలహృత* మనుజాధ్వశ్రమయగు ॥గౌ॥ ౨ ॥ సతతజ
లకణా *సారసేకపల్ల।వితకుసుమితఫలిత * విటపితీరయగు॥గౌ॥ ౩॥శరదిందుమండల *
సమసైకతజవ । త్వరమమునీశ్వర * భాసమానయగు ॥గౌ॥ ౪॥ పోతరాజసుల* జాత
జానకీరామ। పాతకకర్దమ* పటలక్షాళనియగు॥గౌ॥౫॥

కం ॥ఇలనఖిలజనుల పాపం। బులవాలఁగంద్రోచిభద్ర* భూధరరామో । జ్వల
కృపకుఁ బాత్రులనుగా। మెలఁగింపుచునుండు గౌత *మికిమ్రొక్కె-వెనఁ ॥వ॥ అప్పుడప్పు
ణ్యనదీజలంబులనవగాహనంబుఁజేసియుచితాసనాసీనుండనయిసంధ్యావందనాదికృత్యం
బులు నిర్వర్తించి కొండొకసేపు నిమీలితనేత్రుండనై శ్రీభద్రాచలరామ భద్రచరణకమ
లధ్యానంబుఁజేసిలేచి హరిదాసవతంససముద్గీయమాన రామనామకథాసుధా రసప్రి
వాహంబులనోలలాడుచుఁబ్రముదితాంతరంగుండనైపురంబుప్రవేశించుసమయంబున॥గీ॥
తూమువంశపయోరాసి *తుహినకిరణుఁ। డనఁగఁదగుకృష్ణ రామదా * సాఖ్యుఁడంత।
నిరుపమోదారహరిభక్త*వరులతోడ। నెదురుగాఁజను దేర నే* నెలమిమీర॥ కం॥ మంద

స్మితముఖులగు హరి। వందారులకందఱకును* వందనములనా। నందమునఁజేసితత్పురి। కిం
దగనేగితిమిజాన*కీపతికరుణఁ॥ గీ॥ చారుతరరత్నమంటప*సౌధములను। వరుసముక్తా
మణీరంగ*వల్లికలను। ధర్మగోపురమణిసాల*భంజికలను। వెలయుభద్రాద్రిపురము

కళ్యాణి. త్రిపుట. ( సే*వించఁగలిగె॥

వరభద్రాచలమను*వైకుంఠపురమునే*డరుదుగఁగనుగొంటిని। వేడ్కమీర। నరు
దుగఁగనుగొంటిని॥ అ॥ చిరతరబహుజన్మా*ర్జితఘోరపాతకో। త్కరముదొలఁగ కామి*
తములు చేకూరఁగ॥ చ॥ సురుచిరరత్నగో*పురభాసమానమై। నిరవధికోత్సవ*నిత్యశోభన
మై॥ పరమభక్తోత్తంససంతత*పఠిత శ్రీరఘురామనామా। ద్భుతమధురిమాపూరితాశాం*
తరమునై నిరవద్యమై తగు॥ వ॥ ౧॥ వలయితరోహణా*చలలసత్ప్రాకార। కలితమై నిర్జర*
గణసేవ్యమానమై॥ బలవదసదృశడమరుడిండిమ*పటహకాహళనాదకోలా। హలతిరోహి
తతవితరస్వన*మై జగత్త్రిగపావనంబగు ॥ వ॥ ౨॥ రామలక్ష్మణజనక*రాజసు
తాంచిత। హేమవిమానభా*రామమయి జానకీ॥ రామదాసముఖర్షిరాకా*యామి
నీరమణోదయంబై। భూమహిమజలసేచశిశిరో*ద్ధామవీథీస్సృతంబగు॥ ౩॥

బిలహరి. త్రిపుట.

స్థిరభక్తితో శ్రీ*సీతారమణుని*సేవింపనిదేసమయము। మనమందరము॥ సేవింపనిదేస
మయము॥ అ॥ గురుభవవనధిమ*గ్నులమగుమనకిపుడు। తరణికైవడిదొరికె*ధన్యులమయి
తిమి॥ స్థి॥ తననుభజించుస*జ్జనులకభీష్టములనిమిషద్రుమము చె*న్నొనరఁగుచుందును॥
స్థి॥ ౧॥ పటుతరకామాద్య*పథ్యవివర్జితో। త్కటభవరుజకగదం*కారుఁడనమించె॥ స్థి॥ ౨॥
మును వాయుసుతుఁడీ*ఘనుకృపనణుతరుఁ। డనమహత్తరుం*డనఁబ్రసిద్ధిఁగాంచె ॥ స్థి॥
౩॥ భృకుటిమాత్రనం*భోధియీవిభునెదుట। ప్రకటభీతి మా*క్తికమననిల్చెను॥ స్థి ॥ ౪॥ ర
హిమించిజానకీ*రామదాసునిఁబ్రోవ। మహితభద్రాచల*మందిరమునఁదనరె॥ స్థి॥ ౫॥
కం॥ హరిభక్తులతో నీగతి। గురుతరభద్రాద్రిరాడ్వై*కుంఠాధిపునస। చ్చరితములు దెల్పు
చునుగో। పురరత్నముగడచిపవన*పుత్రునిగంటిఁ॥

బేగడ. ఆది.

వందనముఁజేతుపవన*నందననీకు॥ వం॥ అ॥ బృందారకరిపు*బృందహనననే॥ వం॥ శ్రీ
రామపదసర*సీజాతములుఁజూపి। కారుణ్యమునమమ్ము*కడతేర్చుమనినీకు॥ వం॥ ౧॥ వి
తతజవోల్లం*ఘితపారావారసం। శ్రితభక్తలోకకా*మితఫలమందార॥ వం॥ ౨॥
జానకీరామదా*సవశంకరలం। కానిశాటభయం*కరరామకింకర॥ వం॥ ౩॥

గీ॥ అనుచునీరీతిహనుమంతు*నభినుతించి। మహితమై యొప్పు దివ్యవి*మాన
రాజ। మునకువేడ్కఁ బ్రదక్షిణ*ములనొనర్చి। యినకులోత్తంసుసేవింప*నేగుతరిని॥

తోడి. ఝాపు.

అసదృశమైనగ*ర్భాగారముమది*కానందమొనరించెను। నేడుబ్రహ్మానందమొనరిం

భద్రాద్రిరామభవబంధవిశ్రామశీతా। చేతోభిరామజగతీత్రితయైకధామ। జన్మార్జితేనసుకృతేనచిరాదిదానీం। ధన్యోస్మితెచరణపంకజదర్శనేన॥

ఆనందభయిరవి- ఆది.

చరణకమలముల * సందర్శించితి * జన్మసఫలముగను॥ వైకుంఠరాముల॥చ॥ అ॥ గురుతరతపమున * కుమెచ్చికృపను। ద్ధురగతితో భ*ద్రునివయిధుమికిన ॥చ॥ సరసిజహలకులి *శధ్వజచిహ్న। భరణంబులనుగు * భవతరణంబుల ॥చ॥౧॥ చతురాననముఖ* సకలదేవతా। తతిపూజితముల * ద్యుతిరాజితముల ॥చ॥ ౨॥ సనకాదిమహా * మునిదహరనికే। తనములదోషో*ద్ధతిఘాతనముల॥చ॥౩॥ శ్రుతికల్పమహీ*రుహసిఖరసముం। చితకిసలయముల* శ్రీనిలయముల॥చ॥౪॥జానకీరామాభి*ధానాశ్రితహృ। ధ్యానగమ్య

హుస్సేని. ఆది. [ములసం*స్థానరమ్యముల॥చ॥౫॥

త్వదన్యంనజానే* శ్రీ*జానకీజానే ॥అ॥కదాజన్మజలధే*ర్ఘోషా* స్పదంతారయసిమాం॥త్వ॥ధనుర్బాణధారిణే*శాంభవ*దనుర్భంగకారిణే॥త్వ॥౧॥జితాత్యుగ్రవాలిణే* దోః * ప్రతాపాంశుమాలిణే॥ త్వ॥౨॥ దశశిరోవిదారిణే*సదా*ధర్మమార్గచారిణే॥ త్వ॥౩॥భద్రనగవిహారిణే*లోకో*పద్రవాపహారిణే॥త్వ॥౪॥కామితప్రదాయిణే*జానకి

ఖమాచి-ఛాపు. [*రామహృదయశాయిణే॥త్వ॥౫॥

సీతారామా*సేవేహం। శ్రీ॥సీ॥అ॥ స్ఫీతవరస్వర * ప్రేమాభిరామా॥సీ॥జనకదశరధో*జ్వలతపఃఫలా। ఘనతరభువనా*వనకేళికుశలౌ॥సీ॥౧॥ పాతివ్రత్యైక * పత్నీనిరతౌ। జాతరూపజీ* మూతతనుభృతౌ ॥సీ ॥౨॥స్ఫురదరవిందసా* శుగచాపధరౌ।స్థిరనిలయిత భద్రా* క్షితిధరశిఖరౌ॥ సీ॥౩॥ సౌందర్యజితరతి * శంబరాహితౌ। నందనీక్ష

అఠాణ- ఛాపు. [తజా*నకీరామాశ్రితౌ॥సీ॥౪॥

రఘుకులేంద్రపాహి*ఆయాహిశ్రీ*రామచంద్రపాహి॥అ ॥ అఘవిదూరనిగ*మఘనపంజరకీర॥ర॥భూరిదయాసారా*సీతాహృ*న్నీరేజాగారా।తారహారమణి*స్థగితకేయూరశ్రీ॥ర॥౧ ॥ ఖ్యాతచతుర్వ్యూహ *దానవతూ *లాళిహవ్యవాహ।వీతమోహాజీ*మూతదేహశ్రీ॥ ర॥౨ ॥దళితోగ్రశరాసా * శ్రీభద్రా*చలసౌధనివాసా।లలితహాసస ము*జ్వలవిలాసశ్రీ॥ర॥౩॥కామితసురసాలా*జానకీ*రామావనశీలా।హేమచేలసం *

బేగడ- ఆది. [గ్రామాభీల శ్రీ॥ర॥౪॥

దయాసారసింధో*సం*శ్రయమేలోకబంధో॥అ॥భయార్తే*రహంభా*వయేదివ్యమూర్తే॥ద॥దశాస్యేందురాహో*మహో*ద్దండదీర్ఘబాహో॥ ద॥౧॥ పతంగేంద్రకేతో*జగ*త్పాలనైకహేతో॥ద॥౨॥ధరాజావిలాసిణే* భద్రకు*ధరేంద్రాధివాసిణే॥ద॥౩॥నతాఘౌఘశోషిణే* జా*నకీరామతోషిణే॥ద॥౪॥

గీ॥ఇట్లునుతియించిమానిహృ* ధ్యేయమైన। జానకీజానిరూపంబు* సంతసమున। విమలహృత్ప్రీతినిడుకొని *వెడలిగంటి। మహితమైయొప్పు కళ్యాణ * మంటపంబు॥వ॥తద

నంతరంబుపుష్పకవిమానంబునుంబోలె మహిమాభిరాముంబైయున్నయమ్మణిమంటపం

నాటకుర్వంజి-అట. [బునసధివసించి॥

సీతారాములపరిణయోత్సవకథ*సీతాంశుముఖివినవే*వీనులలర*సీతాంశుముఖివినవే॥
అ॥భూతలమునభక్త*వ్రాతమునేలవి।ఖ్యాతిగభద్రన*గమునవసించిన ॥ సీ॥ వరశార్వరి
వ*త్సరమధుమాసము।నరహితశుక్లపక్ష * నవమీభృగువా।సరమునసభిజి* త్సమయంబు
ననిం । దిరయగుసీత ను*హరియగురాముల।నురగవిభుఁడగు లక్ష్మణునిభా *స్వరమణీ
మయమంటపంబున । బరగుకాంచనపీఠములను * స్థిరముగావేంచేపుఁజేసిరి ॥సీ॥౧॥అ
లసనకాదిమౌ * నులువిప్రులయివేద । ములునుదు వనారదా * దులుహరిదాసులై।
యలరుచుగాన *మ్ములుసేయరంభా । దులువారవనితలై * చెలఁగుచునటియింప ॥
నలఘుదుందుభి పటహముఖవా * ద్యములుమంగళతూర్యనివహ । మ్ములుసిలింపులుభృ
త్యులైది *గ్వలభులద్రువఁగ్రమ్రోయించిరి ॥ సీ॥ ౨॥అమరేంద్రముఖ్యది*గధిపులు సభ్యు
లై ।సముచితగతినిల్వ *జలదజలతుషా ।రములుపుష్పవ* ర్షములయిగురియహ।ర్షము
నపోతరా *జ్జానకీ రామదాసుఁ ॥డమరచామరమందివీవఁగ * నఖిలజయనిస్వనములె
సఁగఁగ ।నమితమగు ముక్తాఫలపరిక*రములతలఁబ్రాలోసిరపుడు ॥ సీ॥౩॥

ఎమకులకాంభోజి- అట.

రథముసేవించితినీ * నామనో * రథమలీడేరఁగను ॥ అ॥అధిగతనవర*త్నా
భిరామమై । పరిధితమైతారక *పథనిరోధిమైన ॥ర॥ హరిదశ్వబింబము * కరణిశిఖర
మున । నురుహేమకుంభమం * బరమునఁదళుకొత్తు॥ ర॥ ౧ ॥ పవనచలధ్వజ*పటము
లుగీర్వాణ । ప్రవరులమింటబ* రాబరులుగావింప॥ర॥౨ ॥ధణధణకృతిసము*ద్ధతిగతు
లనుక్రింద।ఫణిరాట్ఫణములఁ*బడలుపడఁగఁజేయు॥ర॥౩ ॥ పటువిద్రుమస్తం*భప్రభలు
మహా।నటునకాలసంధ్య * నటనోన్ముఖుఁజేయు॥ర॥ ౪॥జనకజలక్ష్మణ*సహితులయిశ్రీరా
ములనుపమవైభవ*మునిలచివేంచేయు॥ర॥౫॥నానావిధవాద్య*నాదములెసఁగమ। హ
నురక్తిహరిదా*సాగ్రిణులుభజియింప॥ర॥౬॥ఆనందపారవ*శ్యమునపోతరా ।జ్జానకిరా

సావేరి-త్రిపుట. [ముఁడు*సన్నుతింపుచురాగ॥ర॥౭॥

సేవించిధన్యతఁగాంచితీ* శ్రీరాముల*భావించిముదమువహించితీ ॥అ॥ఠీవినలరుభ
ద్రి*గ్రావనివాసుని॥సే॥గౌతమిజలముల * ఘనమణిప్లవముపై। నాతతలీలవి*హారమున
ల్పఁగనే॥సే॥౧॥అరుదుగపల్యంకి*కాధిరూఢుఁడై ।పరగచక్రవారి*కరుగుదేరిరాగ॥ సే॥
౨॥ధైర్యముమెరయను*దారచమత్కృతి। చౌర్యోత్సవంబున*సంతసింపుచునుండ॥సే॥౩॥
ఘనసారమలయజా*గరుమృగమదమిళి।తనవకుంకుమచూర్ణో*త్సవమునవిలసింప॥సే॥౪॥
జానకీరామాభి*ధానదాసుఁడుబ్ర । హ్మానందముననోల*లాడుచుభజియింప ॥సే॥౫ ॥

షామకళ్యాణి- ఆది.

రామమామవకుల*శ్యామాశ్రితా*రామ॥ అ॥భూమిజోత్పలినీ*సోమసార్వభౌమా।

రా॥ఆజానుభుజాదండా॥దైత్య॥రాజవిదారణశౌండా॥సకోదండ॥రా॥౧॥పాలితదివిజ
వ్రాతా॥భద్ర॥శైలశృంగాగ్రనికేత॥వినీత॥రా॥౨॥ఆకర్ణాయతనేత్రా॥భక్త॥లోక
పయోరుహమిత్రా॥జగన్మిత్ర॥రా॥౩॥రాజితమణిమయభూషా॥పోత॥రాజదాసకి

పూరికళ్యాణి ఛాపు. [రామపోష॥దశవేష॥రా॥

శూరాననువేగమనుపవ॥వేరా॥జగదేక॥శూ॥అ॥రారానీతనయునివీడుటమేరా॥
తారహీరహరాసముదార॥ శూ॥ శ్రీదానామీదదయరారాదా॥వేదనాదపావాగతభే
ద॥శూ॥౧॥ భూపాభద్రధరిత్రీధరదీపా॥కోపచాపరోపాసమారోప॥శూ॥౨॥రామార
క్షిత శ్రితజానకిరామా॥ శ్యామధామరామరణభీమా॥శూ॥౩॥

నాదనామక్రియ ఆది.

జయజయజనకజారమణా॥రిపుహరణా॥అ॥నియమధారణా॥నిగమోద్ధరణా॥
జ॥ సాగరగర్వవిరామా॥కౌ॥సల్యాగర్భాబ్ధిసోమా॥శ్రీరామ॥జ॥౧॥ ధను
రంకితదోశ్శాఖా॥దు॥ర్జనతిమిరోష్ణమయూఖా॥నతలేఖ॥జ॥ ౨॥ శ్రీభద్రాచలగే
హా॥వి॥వ్యాభరణోజ్వలదేహా॥నిర్మోహ॥జ॥౩॥ స్ఫారతరక్షయతూణా॥జానకిరామ

శ్రీరంజని. ఆది. [శ్రితసంత్రాణ॥ధురీణ॥జ॥౪॥

భద్రింవిశమే॥భద్రాచలసదన॥ అ॥కద్రూభవరిపు॥ముద్రితకేతన ॥భ॥ వైరిని
చయపం॥కేరుహవారణ। దారుణతాప॥త్రయనివారణ ॥ భ ॥౧॥ సకలవసుమ
తీ॥శ్వరబృందారక। ప్రకటపుషితవా॥కృపిబృందారక॥భ॥౨॥ అతిశయదోర్బల॥
కృతఘనసంగర।సతతసమర్థిత॥సత్యసంగర॥ ౩ ॥జానకిరామదా॥సానతచరణా। నా

జంఝూటి- ఆది. [నానిగమాం॥తానుసంచరణ॥భ॥౪॥

శ్రియందేహివైదేహిమే॥ అ॥ శ్రియంతమిహమామవేహి॥శ్రి॥కృపాతిశీతలకటాక్ష
జాలే।అపారసంపత్ప్రదానశీలే ॥శ్రి॥౧॥చరాచరావనధురీణదీక్షే॥దురాసదాపద్విభే
దదక్షే ॥శ్రి॥౨॥పలాశకులహారణైకకరణే। బలారిముఖనిర్జరనతచరణే॥శ్రి॥౩॥జానకిరా
మదాసమనోమందిరే॥ఆననరుచిజితపూర్ణచందిరే॥శ్రి॥౪॥

బిలహరి.అట,

సీతాంహృదిభావయే॥భద్రాద్రిని॥కేతాంహృదిభావయే॥అ॥పూతాంసుగుణవి॥
ఖ్యాతాంరామపరిణీతాం॥స్మితాం॥ సీ ॥రమ్యాముపనిష॥ద్గమ్యాంసువితీర్ణకామ్యాం॥
సౌమ్యాం॥సీ॥౧॥భవ్యాంసురసం॥సేవ్యాంభువనసంభావ్యాం॥భవ్యాం॥సీ॥౨॥ఆర్యాంస
మధికౌ॥దార్యాంసముదగ్రధైర్యాం॥ధుర్యాం॥సీ॥౩॥శాంతాంకమలని॥శాంతాంవిమ
లసుస్వాంతాం॥ కాంతాం॥సీ॥౪॥ రాజాంచితముఖాం॥భోజాంశ్రితకల్పభూజాం॥
భూజాం॥సీ॥౫॥వామాంశ్రితజానకీ॥రామాంవిభవాభిరామాం॥ శ్యామాం॥సీ॥౬॥
స్వామివారిసన్నిధిసెలవు॥॥॥ నీలాంబరి. ఛాపు-

దేహిమేమువానుజ్ఞాంవై॥దేహిహృదమేశా॥ అ॥ శ్రీహరేభద్రాద్రినాయక॥

గేహం ప్రతిగంతుం పునరాగంతుం॥ దే॥ జననమరణదు*స్సహసంస్రుతివా|రినిధేస్త్వా
ముద్ధ*రిష్యామీతి చ॥ దే॥ ౧॥ యావజ్జీవిత*మాత్మచరణరా|జీవచింతనాం* తేవర్ధయా
మి॥ దే॥ ౨॥ నిచయేకరుణా*నిఖిలదేహినాం|శుచితాహృది తే*సుతరాం స్యాదితి॥ దే॥ ౩॥
జానకిరామదా*సంస్తుతమివ కృప|యానుపాలయి*త్యమీత్యనిశం॥ దే॥ ౪॥

గీ॥ చైత్రశుద్ధత్రయోదశీ* భౌమవార|రాత్రినానందమిగురోత్త*రామచంద్రు|సన్ని
ధినినృత్యభజనమ్ము*సల్పితద్వి|భుననుమతిగాంచి భద్రాద్రి*పురము వెడలి॥

పంతువరాళి అట.

దండకారణ్యముగడిచితిమికో* దండపాణికృపను॥ అ॥ చండతరతుష్ణవే*దండభయద
మైన॥ దం॥ హరినఖవిదళిత *కరికుంభనిష్పత|ద్వరముక్తాఫలో*త్కరముద్రితంబగు॥ దం॥
౧॥ తతకుంజసుప్తో *ద్ధితశార్దూలానను| ద్రుతభీతివిచే *ష్టితమృగకులమగు॥ దం॥ ౨॥ స
తతమునీశ్వర * సుతపర్యమాన|శ్రుతిముఖరితపరి * శుద్ధాశ్రమమగు॥ దం॥ ౩॥ నిరతగతా
గత* నిఖిలపాంథధన|హరణోద్యతతత *స్కరనిలయంబగు॥ దం॥ ౪॥ జానకిరామదా*సా
నందదాయక|జానకినాయక*చరణచిహ్నితమగు॥ దం॥ ౫॥

గీ॥ అంతకతిపయప్ర* యాణంబులమరనే| లూరిపురముఁజేరి*యుచితగతిని| వాస
రద్వయంబు * వసియించియచ్చటి| హరిహరులను గాంచి*యభినుతించి॥

శుద్ధకాంభోజి. ఆది.

సంతానగోపాలా*పాలయశ్రీ*కాంతాహృదయలోలా॥ అ॥ చింతితఫలదాన*సం
తానసాల*ని*రంతరహేలాపు*రాగారఖేలశ్రీ॥ సం॥ తాపింఛసన్నిభ*తగుణదేహ*వ
ర*గోపవధూకుచ*కుధరవారివాహ॥ సం॥ ౧॥ పరిహృతభవభం*గురధరణీశోక| మురళీ
గానవి*మోహితాఖిలలోక॥ సం॥ ౨॥ ఆతతబృందార*ణ్యావిహృతిచంగ*సు|స్మితదయా
రస *సీతలితాపాంగ॥ సం॥ ౩॥ ప్రకటశిఖావళ*బర్హచూడ*జా| నకిరామదాసమ*నస్స

కం॥ ఆవీడు వెడలిపౌరిభ|క్తావళితోనేదినత్ర*యంబునకును బృం [తతక్రీడ॥ సం॥ ౪॥
దావనపుర ప్రవేశము |గావించెదుతరినిపౌర *గణములుతమలోన॥

శ్రీరాగము. అట.

బృందావనముప్ర*వేశించుసరణిపూ*ర్ణేందువదనవినవే॥ అ॥ వందారుబృందసం*
వళితుఁడగుచునత్యా|నందముతోడజా * నకిరామదాసుఁడు॥ బృం॥ కరమనురక్తిత *
త్పురిఁగల్గువారలం| దరువచ్చికుశలము*నరసిప్రీతినొంద॥ బృం॥ ౧॥ వరభద్రాద్రీ* శ్వరక
థలాప్తుల|కరుదుగసుశ్రా*వ్యముగఁదెల్పుచు॥ బృం॥ ౨॥ పరమభాగవతో*త్కరమెదురేగి
ని| ర్భరభక్తి నిశ్శ్రీ*హరిభజనము సేయ॥ బృం॥ ౩॥

చ॥ పరమకృపాసముద్రుఁడగు*భద్రగిరీశుననుగ్రహంబునన్|స్థిరశుభలగ్నమందధివ*
సించిస్వకీయనివాసమందుసా| దరముననాత్మదేవునియ * థాస్థితినిల్పియథోచితంబుగా
నురుమతితత్ప్రసాదవిని * యోగముఁజేసితి భూసురాళికిన్॥

## మంగళగిరినరసింహస్వామివారిసంకీర్తనము.

బిలహరి- ఝాపు.

నరహరినెప్పుడును * నమ్మినవారలకేమికొదువ॥ అ॥ పురుహూతముఖ్యా* మరులుసేవింపభా। స్కరకోటితేజోవి * స్ఫురణమెఱయుచున్న ॥న॥ సరసిజభవదత్త* వరగర్వమునఖిలకరుఁడగుచునుని * ర్జరులబాధింపఁగ ॥ గరిమతోమతఁజక్రనామ్యం* తరగతుండై వెడలినమిచిని। దురమునను వధియించి మంగళ * ధరణిధరమున వెలసి విలసిలు ॥ న ॥ ౧ ॥ పారియాత్రాత్మసం * భవుఁడు హ్రస్వశృంగి । వారక సద్వ్రవ* ర్వతసమున్నతినిఁ ॥ గౌరి తప మొనరింపఁగాఁ గరు * ణారసంబున వానిఁ బ్రోచుటకై రమారమణీ సమేతము * గారయుంబున వచ్చి నిలచిన ॥ న ॥ ౨ ॥ అగణితముగఁగృత * యుగమునసుధ త్రేతా। యుగమునగోఘృత* ముఁ ఉవడి ద్వాపర॥ యుగమునను గోక్షీరములుకలి* యుగమునందుగుడోదకము తా। నగమునగమునుగ్రోలిజనులను * విగతదోషులఁజేసిగాచిన ॥ న ॥ ౩ ॥ ధరలోనఁబ్రత్యక్ష * దైవమనుచుఁదన। పరమసౌలభ్యముం* దరుగొనియాడఁగ॥ నిరుపమానమహోత్సవంబులఁ* బరగి జానకిరామదాసుని దురితములుదొలఁగించి పదపాథోజభక్తునిఁగాఁదనర్చిన ॥న॥౪॥

ఆనందభైరవి - ఆది.

నరహరినిను నే* నమ్మితిరా* శ్రీ ॥న॥ అ॥ గురుతరకృపచే * నశసిబ్రోతువని ॥న॥ దనుజాధిపుఁడగు * కనకకశిపువేఁ। దునుమను స్తంభం* బున వెడలిన శ్రీ ॥న॥౧॥ పరమభాగవతుఁ* బ్రహ్లాదునిన। త్కరుణమీరఁగను * గాచితివనుచును ॥ న ॥ ౨ ॥ వనజభవాదుల* వినతులుగైకొని। యినకోటిప్రభఁ * దనరుచున్న శ్రీ ॥న॥౩॥ సలలితశేషా * చలపతివలె శ్రీ। లలనతోడమంగ* ళగిరిని వెలసిన ॥న॥౪॥ జానకిరామదా* సపూజితచరణా। మానిసమాజక* [మలమిహిరకిరణ॥ న॥౫॥

భైరవి- త్రిపుట-

కలకంఠివినవెమం * గళగిరినరహరి* కళ్యాణోత్సవవిధము ॥అ॥ కలియుగంబునభక్తజనముల * కలుషములఁ దొలఁగించిపోవఁగ । వెలసితనవిభవంబునంతయు * విశ్వమెల్లనునిండఁజేసెను ॥క॥ వరనందనసం* వత్సరఫాల్గుణభా * సురశుద్ధచతుర్దశినిఁ। బరమలావణ్యమ * మరపెండ్లికూతురౌ * సిరికిమోదముమీరఁ। బురహరు రాణియా* పరమేష్ఠిసతిపురం। దరుపత్ని మంగళ * కరస్నానమొనరించి॥ మెరుఁగుబంగరుచేలమునుసుం* దరతరంబగురవికెదివ్యా। భరణములసుమచందనాదులఁ* బరగనవ్వడలంకరించిరి.॥ క॥౧॥ దిగధీశులాహరికిఁ* దగస్నానమొనరించి* జిగిమిగులుకౌశేయము। సొగసైనమకుటము* సురుచిభూషణముల* మిగులశృంగారించి। జగతీసురులుమునులు* సప్తర్షినివహము। అగజేశబ్రహ్మాదు * లాదంపతులను ॥ తొగలదొరదీధితులనెగడుచు* భుగులుకొనువాసనలఁ జెలఁగుచు। జగతినొప్పెడు మంటపంబున * నిగమవిధివేంచేపుఁజేసిరి ॥క॥౨॥ తిరుకళ్యాణావ* సరమునరంభాది * తరుణులునటియింపఁగ । గరుడగంధర్వకి * న్నరసిద్ధోరగ

కిం*పురుషులునుతిసల్పఁగఁ।గరమొప్పఁగానుదుం * బురునారదాదులుచే। మరుశుభకర
మగు *_సరసగానము సేయ ॥ సురసమూహములవిరులవానలు * గురియుచుండఁగ భ
క్తాగ్రే। సరులుమ్రొక్క-వధూవరులకును * సిరులొదవఁదలఁబ్రాల్వోసిరి ॥క॥౩॥ క్రమ
ముగబ్రాహ్మణో * త్తములువేదపఠ*నములుగావింపఁగా।సుమహితప్రబలం * ధముశ్రీ
వైష్ణవబృం * దముసంధానముసేయఁగ । రమణభేరీకాహ * ళములాదిగావా।ద్యము
లుదుందుభులుసమ్మ*దమునమ్రోయించఁగ॥గములుగొనిశ్రీరమణనరహరి *కమలనయన
యటంచుశుకపిక। సమదహంసమయూరశారిక * లమరఁగనునినదములుసల్పెను॥క॥౪॥
అలరఁగఁగరదీపి*కలుసహస్రసం * ఖ్యలఁదేజరిల్లఁగను । యిలఁగలదేశాధీ*శులుమొద
లగుజన*ములుసేవించఁగను।కులకాంతలెల్లగుం*పులుగూడుకొనిపా।టలు బాడుచును
ముత్యా * ములపఁరతులివ్వఁగ ॥ సలలితంబగుశేషగిరివర* నిలయునతిశయమై భవోత్స
వ।ములకుజోడని జానకీరా *ముఁడుముదంబునను గొనియాడెను ॥క॥౫॥

పంతువరాళి - ఛాపు-

అమలమతినినర * హరినవ్యరథోత్స*వము సేవించితిని ॥అ॥కమలావసుంధరా*కాం
తలుభయపా। ర్శ్వములఃసరంత తామో * దమునఁజెలంగఁగ ॥నమ॥కనకకిరీటాది* ఘన
భూషఖచితర। త్ననివహద్యుతులాశాం*తములనిండఁగ ॥ నమ॥౧॥ కరములసంతోష*
కరముగభక్తుని। కరమువింజామరలు*గరమొప్పవీవఁగ ॥నమ॥౨॥ అనుపమముగవారాం*
గనలగ్రభాగము।ననుసవిలాసన *ర్తనములుసల్పఁగ ॥నమ॥౩॥ ధరలోమంగళగిరియే*పర
మపదమునకు। సరియగునని భూ*సురవరులువొగడఁగ॥నమ॥౪॥ నతపోతరాజజా * నకి
రామదాసుఁడం।చితభక్తితోడసం * స్తుతులొనరింపఁగ॥నమ॥౫॥

శుద్ధకాంభోజి-ఆది.

ననుమఱచేవుసుమీ * నరహరినీవు ॥న॥అ॥ ఘనముగపరాకు * గలిగినదొరవట॥ న ॥
అనయమర్థిగణ*మునకొసఁగినయీ। వినిమఱచినరీ*తినీసమయమున ॥న॥ ౧ ॥ పరులొన
రించున * పకృతులనెల్లవే।మరతువటయా * సరణినేయెడల॥ న॥౨॥వనజాక్షసురసే *
వనమంగళాద్రిభ।వనజానకీరామా*వనమునిసేవన ॥న॥౩॥

## పెదమద్దాలి ఉద్దండ రాయస్వామివారి సంకీర్తనము.

రీతిగౌళ- ఛాపు.

తనరుశ్రీమదు * ద్దండరాయులపద * వనజములనుగంటిని ॥అ॥ అనిశమబ్జజా * ద్య
నిమిషమకుటా । గ్రఖచితమణిగణ * కాంతికలితములై ॥ ద ॥ తత భవ జలధిని *
స్తరణసాధనములా। శ్రితజనతాసం * జీవనంబులై ॥ ద॥ ౧ ॥ తరుణకిసలయమా* ర్ద
వసమా హితము।లురగరాజపాదు * కోద్భాసితములై ॥ద॥౨॥ నిగమతులాకోటి*ని
నదహృద్యముల।త్యగణితశుభరే * ఖానవద్యములై ॥ద॥౩॥ శ్రీలసత్పెదమ* ద్దాలిపు రస్థి
త। కేళిసదనోప * లాలితంబులై ॥ద॥౪॥పోతరాజకుల*జాతజానకిరా । మాతిశయనిశ్రే

